లెక్కలేని పరిమళపుష్పరాసులతోను శోభిల్లుచుండెను. భూదేవి తనకుగల యుత్తమములు రమ్యతమములునగు వానిని సమర్పించి తన ప్రభువునకు స్వాగతమిచ్చెను. ఆ ప్రభువు షోడశవర్షప్రాయముగల యువకుడు, సనత్కుమారుడు, చెక్కుచెదరని శాశ్వతయౌవనుడు,నూతనధరణీనాధుడు తన రాజ్యమునకువిచ్చేసెను.అధికారక్రమము ననుసరించియున్నను, భూలోకపుగణనకతీతులై క్రియాశక్తిచే నిర్మించుకొన్న దివ్య శరీరములలో వెలుగుచు ముప్పదిమంది దివ్యపురుషులచటనుండిరి. వారే ప్రథమ మహీపీఠము, ఘనమగు నేకైక వటవృక్షశాఖలు, భావిసిద్ధపురుషులు పెరిగెడు ఆశ్రయము, ఆధ్యాత్మిక జీవమునకు కేంద్రము. దేనిచుట్టును మనభూమిపై జీవమెల్లప్పుడును పరిభ్రమించుచుండునో అట్టి అచంచల ధృవతార, భూలోకప్రభువునకు చిహ్నమగు నుజ్జ్వలతార, ఎచట నిరంతరము ప్రకాశించుచుండునో అట్టి అక్షరపుణ్యక్షేత్రమే అప్పుడును ఇప్పుడునుగూడ వారి నివాసము.

'గుప్తవిద్య' అను గ్రంథములో మేడమ్బ్లవట్స్కీగారిట్లు వర్ణించిరి :

"ఇప్పుడు చెప్పినట్టియు, నామరహితుడై యుండవలసినట్టియు, మహావృక్షమనదగు ఆమహానుభావుని నుండియే ఈ తరువాత యుగములలో చరిత్రకు సుపరిచితులగు కపిలమహర్షి, హెర్మిస్, ఎనాక్,ఆర్ఫియస్, మొదలగు ఋషులు ఆచార్యులు శాఖలువలె ప్రభవించెను. స్థూలమానవునిగా నెంచినయెడల ఆయన నిగూఢమగు పురుషుడు, (అపవిత్రులకెప్పుడు నదృశ్యుడే, కాని యెల్లప్పుడు నుండువాడే). ఆయననుగూర్చి ప్రాచ్యదేశములలో, ముఖ్యముగా పవిత్రయోగ శాస్త్రాభ్యాసకులకును, గుప్తశాస్త్రకోవిదులకును తెలిసినగాధ లనేకములు గలవు. ఆయన ఇతరరూపములను మార్చుచుండియు తనలో మార్పేమియు లేకుండ నెల్లప్పుడొకేరీతిగ నుండువాడు. మరియును, ఆయనయే యీ యావత్ప్రపంచములో దీక్షితులయిన సిద్ధపురుషులందరిపైన ఆధ్యాత్మిక ఆధిపత్యముగలవాడు. అయన అసంఖ్యాకములగు నామములను గలిగియుండియు నామరహితుడు; కాని, ఆయన నామములుగాని, ఆయన స్వభావమైననుగాని యెవ్వరికి తెలియవు. "మహాత్యాగి" యనబడు "ఉపదేష్ట" ఆయనయే.ఏలయన, తమోమండలమును దాటక దానిలోనేయుండి, తేజోమండల ద్వారమునద్ద కూర్చుండి ఆయన తేజోమండలములోనికి చూచుచుండును. మరియును ఆయన ఈజీవ వృత్తము (Life Cycle) యొక్క తుదిదినమువరకు తన స్థానమును వీడరు. "ఏకాకియైన ఆ కాపరి" (Solitary Watcher) స్వయం నియోజితపదవియం

దిక్లైందుకుండవలెను ? భూమిమీదగాని, స్వర్గమందుగాని ఆయనయెరుగనిది, నేర్చుకొనవలసినది యేమియు లేకపోయినప్పుడు సనాతనజ్ఞానబుగ్గవద్ద ఆయన, ఏమియు త్రాగకపోయినను, ఏల కూర్చునియుండవలెను ? కారణములేమై యుండగలవు ? స్వగృహమునకు మరలిపోవుచు దిక్కులేక పాదములు పుండ్లుపడి బాధపడుచున్న యాత్రికులు ఐహికజీవిత మనబడెడు మాయా ప్రకృతులతోగూడిన అనంతమగు నెడారిలో తుదిక్షణమువరకు దారి తప్పిపోరను నిశ్చయము లేదుగనుకనే. మరియు, ఆయన యేదేశమునుండి స్వచ్ఛందప్రవాసియై వచ్చెనో, పరిపూర్ణమగు స్వేచ్ఛ, వెలుగు యెచటగలవో ఆదేశమునకు శరీరబంధములనుండియు మాయాబంధముల నుండియు విముక్తుడై విజయుడైన ప్రకృతిబంధితునకు మార్గమును జూపించుటలో వారానందము బొందెదరుగనుకనే. సంగ్రహముగ చెప్పిన, ఆయనచేసిన మహాత్యాగమువలన లబ్ధిబొందువారు బహుకొద్దిమంది శిష్యులు మాత్రమే యైనను, యావన్మానవజాతికొరకు ఆయన సంపూర్ణముగ ఆత్మత్యాగము జేసికొనిరిగనుకనే.

" మానవచైతన్యము మేల్కొన్నదాదిగా ఆచార్యులు, ప్రవక్తలు, బోధకులు నైన తక్కువతరగతి దివ్యపురుషులందరును ఈ మహాగురువుయొక్క పై కగపడని ప్రత్యక్ష దర్శకత్వముక్రిందనే ఆరంభములో మానవజాతికి మార్గదర్శకులయిరి. ఈ యీశ్వర పుత్రులవద్దనే మానవజాతి శైశవములో సమస్త కళలలోను, శాస్త్రముల లోను, ఆధ్యాత్మిక విద్యలోను మొదటిపాఠములు నేర్చుకొనెను. ఇప్పటితరమునకు చెందిన పరిశోధకులను పండితులను కలవరపెట్టుచున్న పురాతన నాగరికతలకు శంకుస్థాపనచేసి మొదటిపునాదిరాతిని వేసినది వీరే.

## ఉ త్త మ దీ క్ష లు

మన గోళమునందలి మహీపీఠములో ప్రథమరేఖమీదనుమాత్రమే మానవున కత్యున్నతమగు పురోవృద్ధి సాధ్యమగును. ఆరేఖయందు 'మనువుదీక్ష' తరువాత మరిరెండు దీక్షలు గలవు. మనువుపైనున్న "పచ్చేక" లేక ప్రత్యేకబుద్ధులను సరిగా తెలిసికొనలేక, కొందరు గ్రంథకర్తలు విచిత్రమగు దురభిప్రాయములను వెల్లడించిరి. వారికి తెలిసిన జ్ఞానమునితరులకు బోధింపక స్వార్థపరులై నిర్వాణములోనికి పోయిరని వానినివర్ణించిరి. ఈబుద్ధు లితరులకు బోధింపనిసంగతి వాస్తవమే. కాని, వారి స్వంత రేఖకు సంబంధించి వారు చేయవలసిన కార్యమున్నది. వారీ ప్రపంచమును విడిచి

పోవుకాలము వచ్చుననుటకూడ సత్యమే. కాని, యితరస్థలములయందు వారి మహత్కార్యమును కొనసాగించుటకే యీ ప్రపంచమును వీడెదరు.

దానిపై దీక్ష ఎవరికివారే తీసికొనవలసినదిగాని, ఒకరిచ్చునది కాదు. ఈ సోపానము సిద్ధపురుషుని లోకప్రభుత్వపదవికి తీసికొనిపోవును. ఈపదవియందు మొదట కొద్దికాలము ఒక ప్రపంచమునకు మొదటిప్రభువుగనో, రెండవప్రభువుగనో యుండి, తరువాత మరియొక ప్రపంచమునకు దీర్ఘకాలము మూడవప్రభువుగానుండు బాధ్యతను వహింతురు.

మూడవప్రభువుయొక్క కార్యము ప్రథమ, ద్వితీయ ప్రభువుల పనికంటె చాలా గొప్పది. మూడవప్రభువు తనకాలములో జరుగవలసిన పరిణామములను తృప్తికరముగ సమాప్తిజేసి, ఆపరిణామమునొందుచున్న లెక్కలేని కోట్లాదిజీవులను బీజ-మనువున కొప్పగించవలసియుండును. గ్రహాంతర నిర్మాణకాలమందు బీజమనువు ఆజీవులన్నిటికి బాధ్యులైయుండి, తరువాతవచ్చెడు గోళముయొక్క మూలమనువునకు తిరిగి ఆజీవులన్నిటిని యొప్పగించవలసి యుండును. మూడవలోకప్రభువు తనకార్యమును నిర్వహించినవాడై మన ప్రపంచమునకు, మహీపీఠమునకు కేవల మావలనున్న మరియొకదీక్షను దీసికొని "మౌనియగుసాక్షి" (Silent Watcher) * పదవిని బొందెదరు. ఆ పదవియందుండి పూర్తిగ నొకపరివర్తమునకు పట్టెడు కాలమంతయు కావలియుండి కనిపెట్టి చూచుచుండును. జీవతరంగము మరియొకసారి మన గోళమున ప్రవేశించి దానిని తిరిగి విడుచుటకు సిద్ధముగనున్నప్పుడు ఆయన తన విచిత్రమగు స్వచ్ఛందసేవను చాలించి ఆపనిని తనతరువాతవచ్చెడు అధికారి కొప్పగించును.

## సర్వులకు పరమావధి

ఈ మహోన్నత పదముల యద్భుతవైభవము మనకతీతమై యున్నను, వాని వైపు మనమనస్సులను త్రిప్పి వానిని కొంతవరకు గ్రహించుటకు ప్రయత్నించుట యుక్తము. అట్లుచేసినచో, మనలో ప్రతివారును ఎదుటనున్న పరమావధిని చూడగలము. ఇందులో మనమందరము ప్రాచీన ఆదర్శమును నెరవేర్చి, శరమువలె వేగముగ గమ్యస్థానమును జేరలేకపోయినను, ఆపరమావధిని ఎంతస్పష్టముగా జూడగలమో అంత శీఘ్రముగను నిలుకడగను మనము పురోవృద్ధిని బొందుదుము.

* భారతీయుల పురాణములలో దక్షిణామూర్తియని వర్ణింపబడినవారు వీరేయని కొందరి యభిప్రాయము.

ఈ మహాయాత్రిలో ప్రతిమానవుడు ఎప్పుడో ఒకరోజున మనలోకముల లోని అత్యున్నత లోకములో సంపూర్ణ చైతన్యమును బొందుటయేగాక ఈప్రాకృత విశ్వలోకముయొక్క అన్ని అంతరములయందు ఏకకాలమున ప్రజ్ఞను గలిగియుండును. అందువలన, తనలో నుత్తమలోకముయొక్క శక్తినిగలిగియుండియు, అతిస్థూలమగు లోకములోగూడ సార్థకముగ పనిచేయగలుగుటకును, అవసరముగల వారికి సహాయముచేయుటకును సమర్థుడగును. మనలో ప్రతివానికి ఆసర్వశక్తిత్వము సర్వవ్యాపకత్వము, నిశ్చయముగ ప్రాప్తించును. ఈ వైహిక నీచజీవనమువలన మనకై సంపాదింపదగిన నెట్టిదానికొరకైనను ఆజీవనము జీవించుటవ్యర్థమేమైనను,అది మనముందున్న వాస్తవజీవితమున కవసరమగు నొక సోపానమై యుండుటచే నిస్సంశయముగ సంతోషముతో సహింపదగినదై యున్నది. "కన్నుచూచి యుండలేదు, చెవి వినియుండలేదు; తనను ప్రేమించిన మానవులకొరకై ఈశ్వరుడు సృష్టించిన వస్తువుల నూహించుటకైనను మానవహృదయము తలపెట్టియుండలేదు;" ఏలయన ఈశ్వరునిప్రేమ, ఈశ్వరునిజ్ఞానము, ఈశ్వరునిశక్తి, ఈశ్వరుని దివ్యవైభవము ఆయన శాంతివలెనే అవాఙ్మానసగోచరములు.

శాంతిః శాంతిః శాంతిః

# తప్పొప్పుల పట్టీ

| పేజీ | | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 23 | — | 26 | గ్మహాముల | గృహాముల |
| 41 | — | 21 | అను | అనను |
| 44 | — | 17 | నవలం | అవలం |
| 45 | — | 16 | చేరగా | చేర |
| 51 | — | 6 | Thoms | Thomas |
| 98 | — | 13 | మకుటమువకు | మకుటమునకు |
| 124 | = | 28 | శ — | శక్తి |
| 126 | — | 1 | శ — | శక్తి |
| 155 | — | 20 | సుపకారము | నుపకారము |
| 168 | — | 2 | బ్దముల | శబ్దముల |
| 177 | — | 26 | లోనె | లోనే |
| 197 | — | 9 | జరిగింత | జరిగినంత |
| 210 | — | 8 | . | , |
| 220 | — | 20 | రెండన | రెండవ |
| 221 | — | 17 | మానవుడే | మానవుడీ |
| 222 | — | 2 | జీవము శక్తి | జీవము, శక్తి |
| 224 | — | 20 | చున్న ట్టి యు; | చున్నట్టియు, |
| 231 | — | 8 | యధ | యంధ |
| 236 | — | 17 | కృషిలో | కృషితో |
| 245 | — | 27 | ననుస... | ననుసరింపుము. |
| 245 | — | 27 | ఈశ — | ఈశక్తి |
| 263 | — | 25 | ‘ నేను ’ కు ముందున్న “ తీసివేసి ‘ నీవు ’ కు ముందుగా పెట్టుకొనవలెను. | |
| 269 | — | 16 | వధియు — | వధియునై |
| 331 | — | 14 | ఆవిష్కరించ నందున | ఆవిష్కరించినందున |
| 334 | — | 2 | పర్య వేక్షము | పర్యవేక్షణము |
| [illegible] | — | 8 | మాన జాతి కై | మానవజాతికై |
| 382 | — | 16 | మొదటి | మొదట |
| 389 | — | 17 | మానవమార్గము | మానవవర్గము |